ఇట్లుండుటచే పాండవులు, ద్రౌపదియు నరకార్హులు కారనియే స్పష్టమైనది. ప్రతివాదు లాదుర్యోధనుని యా స్వర్గప్రాప్తిని జూచి యెట్లు ప్రవర్తించినను దుర్యోధనదృష్టాంతముచే స్వర్గము వచ్చు నని భ్రాంతిపడరాదనియు, నాతని దుష్ప్రవృత్తిఫలము ముందున్నదనుటచే దానికి భయపడవలసినదే యనియు తెలిసికొనవలసి యున్నది. ఆ దుర్యోధనస్వర్గమును బట్టి దుర్యోధనునిది న్యాయమే యను దుర్భ్రమమును, ఆ ధర్మరాజాదినరకదర్శనమును బట్టి వారల దన్యాయమేయను దుర్భ్రమమును పొందవల దని ప్రతివాదులకు దెలుపుచు, విషయాంతర మందుకొనుచున్నాము

— సంస్కృతాంధ్రభారతములు సుయోధనాపకర్షగా రచింపబడిన వను ప్రసంగము-తన్నిరాకరణము —

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—

**"జయము రచించిన వ్యాసుడు పాండవహితు డగుటచేతను, భారతమును రచించిన వైశంపాయనుడు, అర్జునప్రపౌత్రు డగు జనమేజయున కిష్టముగా భారతగాథను జెప్పవలసినవా డగుటచేతను, సౌతి కృష్ణద్వైపాయనుని శిష్యపుత్రు డగుటచేతను, సంస్కృతమహాభారతము సుయోధనాపకర్షముగా రచింపబడె నని తిరిగి చెప్పవలసి యున్నది.**

**ఆంధ్రీకృతభారతములో-నన్నయ కేవలము పాండవవంశసంభూతుడ నని చెప్పుకొను రాజనరేంద్రునకు కృతి నిచ్చుటచేతను, తిక్కన, యెఱ్ఱనలు సూర్యచంద్రవంశస్థు లగు రాజుల నాశ్రయించువారే యగుటచేతను, ఆంధ్రభారతములో గూడ దుర్యోధనయశోపకర్షణమె వర్ణింపబడెను."** (పు 268)

ప్రతివాదులు సంస్కృతమహాభారతమునకు ముగ్గురు కర్తలను కల్పించి, యందు వ్యాసుడు పాండవహితు డని, వైశంపాయనుడు కథ వినెడి జనమేజయున కిష్టముగా జెప్పినవా డని, సౌతి వ్యాసశిష్యుని పుత్రుడేయని, యీ కారణముచే నాగ్రంథము సుయోధనాపకర్షముగా రచింపబడె నని తిరిగి చెప్పవలసి యున్నదని యనుచున్నారు.

వీరి కిప్పుడు సౌతి వైశంపాయనులు మహాభారతమును వినిపించినవారే కాని రచించినవారు కారనియు, భవిష్యద్గాథతో మహాభారతమును రచించినవాడు త్రికాలజ్ఞాననిధి యగు వేదవ్యాసభగవానుడే

యనియు, నాతఁడు చెప్పినదే సత్య మనియు, వాతఁడు దీనదయా పరుఁడే కాని రాగద్వేషములు కలవాఁడు కాఁడనియు, సుయోధను డప కర్షముగా సంచరించుటచేతనే యాతని విషయము అపకర్షముగా జెప్ప బడిన దనియు మరల జెప్పుచున్నాము.

ఆంధ్రభారతకర్తలగు నన్నయాదులు వేదవ్యాసభారతము నాంధ్రీకరించినవా రగుటచే యథార్థమైన మూలము ననుసరించి వారు వ్రాసియుండ నన్నయాదులపై దోషారోపణము జేయుట దుర్నయము.

ఒకని వాశ్రయించి యున్నవాఁడు ప్రమాణవిరుద్ధమైనను ఆతని యిష్టప్రకారమే గ్రంథమును సాగింపవలె ననునది మ. భా. చ. కారుల కనుభవసిద్ధ మేమో కాని ప్రమాణబద్ధులైన నన్నయాదుల లక్షణమది కాదు. వారిచే నాంధ్రీకరింపజేసిన రాజ నరేంద్రాదిప్రభువులు గూడ వేదవ్యాసమహాభారతప్రతిపాదితార్థమునే చెప్పవలసిన దని కోరిన వారు కాని తమ కిష్టమైనట్లు వ్రాయవలసిన దన్నవారు కారు. రాజ నరేంద్రుఁడు నన్నయార్యునితో నేమని చెపినట్లున్నదో చూడుడు.

క. జననుత కృష్ణద్వైపా
యనమునివృషభాభిహితమహాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్.

దీనిని బట్టి సంస్కృతభారతము నాధారముగా జేసికొని యాంధ్రీకరించి యున్న నన్నయాదులపై 'ప్రభుప్రీతికై దుర్యోధనయశోపకర్షణము వర్ణించినారు' అను దోషము నాపాదించుట దుర్నయము కాక మరేమగును? కనుక ప్రతివాదుల వ్రాత హేయము.

ఈ పద్యములో దెనిఁగింపవలసినది మహాభారత మనియు, నది కృష్ణద్వైపాయనమునీంద్రప్రణీత మనియు స్పష్టముగా నున్నందున సంస్కృతమహాభారతమునకు ముగ్గురు కర్తలనెడి మ. భా చ. కారుల మాట త్రోసివేయబడినది. అంశాంతరము—

—• వ్యాసాదులు దుర్యోధనునిపై గల యీర్ష్యను గాంధారిపై గూడ దొరలించిరను ప్రసంగము-తన్నిరాకరణము •—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—

"దుర్యోధనునిపై గల యీర్ష్యను మహాపతివ్రత యగు గాంధారిపై గూడ వ్యాసాదులు కొంత దొరలించి యామె తన తోడికోడలగు కుంతి బిడ్డల గనుచున్న దని తాను కడుపు బాదుకొని మాంసఖండము గనిన దని ప్రకృతివిరుద్ధపుగాథ నొకదాని గల్పించిరి. అట్టిది తోడికోడల సంతతి జూచి కడుపు బాదుకొనునా!"

(పు. 268)

వ్యాసాదులకు దుర్యోధనునిపై యీర్ష్యయట. ఆ యీర్ష్యను వారు గాంధారిపై గూడ దొరలించిరట! వ్యాసాదులనగా సంస్కృతాంధ్రమహాభారతకర్తలన్నమాట. ఈ ప్రతివాదులు వెనుక 'సంస్కృతాంధ్రభారతములు సుయోధనాపకర్షముగా రచింపబడినవి.' అనుటకు హేతువులు 'వ్యాసుడు పాండవహితు డగుట, మిగిలినవారు ప్రభుప్రీతి నపేక్షించినవా రగుటయు' నని చెప్పిరేకాని వ్యాసాదులకు దుర్యోధనునియందు గల యీర్ష్య యని చెప్పలేదు. ఇక్కడ జెప్పిన యీర్ష్యనే అక్కడ జెప్పినయెడల నన్ని కుకల్పనలు ప్రతివాదుల కవసరము లేకపోవును.

వ్యాసమహర్షికి దుర్యోధనునియం దీర్ష్య యని ప్రతివాదులనుట నింద్యము. మహర్షి పాండవులకు దోడ్పడిన విషయము నిరూపించినపు డుదాహరింపబడిన శక్రసురభిసంవాదవచనము, వేదవ్యాస వచనమును మఱియొకసారి చూడుడు—

సురభిః—

"యది పుత్రసహస్రాణి సర్వత్ర సమమేవ మే ।
దీనస్యతు సతః శక్ర పుత్ర స్యాభ్యధికా కృపా ॥"

నాకు బుత్రసహస్రమందును సమత్వమే కాని యాపన్నుడైన పుత్రునియందధికదయ. అని సురభి చెప్పినమాట. ఇచ్చట నాపన్నునియందున్న దయాధిక్యతను బట్టి యన్యులయం దీర్ష్య యనవచ్చునా?

వ్యాసః—

"పాండోః సుతా యాదృశా మే తాదృశా స్తవ భారత ।
దీనా ఇతీవ మే బుద్ధి రభిపన్నాఽద్య తాన్ ప్రతి ॥"

'ధృతరాష్ట్రా! నాకు పాండుపుత్రు లెట్టివారో, నీపుత్రులు నట్టి

వారే. వా రావన్నులై యుండిగని యిప్పుడు నాబుద్ధి వారియందు సంసక్తమైనది' అని మహర్షి చెప్పినమాట. ఇట్లుండ దుర్యోధనునియం దీర్ష్య యనుట లోకజ్ఞానశూన్యతను వెల్లడించుచున్నది.

వ్యాసుడు మహాపతివ్రత యగు గాంధారిపైగూడ నీర్ష్యవహిం చెనట. కుంతి బిడ్డల గనుచున్నదని యామె తన కడుపు బాదుకొనె నని వ్రాసెనట. గాంధారి మహాపతివ్రత యని చెప్పినవాడును, ఆమె గర్భతాడనము జేసికొనె నని చెప్పినవాడును గూడ మహర్షియే. మహాపతివ్రత యనుటలో లేని యీర్ష్య గర్భతాడనకథనములో వచ్చి పడెనా? ఆ గర్భతాడనప్రస్తావ మెట్లున్నదో చూడుడు—

"క్షుచ్ఛ్రమాభిపరిగ్లానం ద్వైపాయన ముపస్థితమ్ ।
తోషయామాస గాంధారీ వ్యాస స్తస్యై వరం దదౌ ॥
సా వవ్రే సదృశం భర్తుః పుత్రాణాం శత మాత్మనః ।
తతః కాలేన సా గర్భం ధృతరాష్ట్రా దథాగ్రహీత్ ॥
సంవత్సరద్వయం తం తు గాంధారీ గర్భ మాహితమ్ ।
అప్రజా ధారయామాస తతస్తాం దుఃఖ మావిశత్ ॥
శ్రుత్వా కుంతీసుతం జాతం బాలార్కసమతేజసమ్ ।
ఉదర స్యాత్మనః స్థైర్య ముపలభ్యాఽన్వచింతయత్ ॥
అజ్ఞాతం ధృతరాష్ట్రస్య యత్నేన మహతా తతః ।
సోదరంఘాతయామాస గాంధారీ దుఃఖమూర్ఛితా ॥" ఆది. అ. 15

ఒకప్పుడువ్యాసమహర్షికి గాంధారి శుశ్రూష జేసి యామహర్షిని తనకు నూర్గురు పుత్రులు కలుగునట్లు వర మిమ్మని కోరెను. మహర్షి యట్లే వర మిచ్చెను. తరువాత నామె ధృతరాష్ట్రునివలన గర్భవతి యయ్యెను. ఆ గర్భమును ఆమె రెండు సంవత్సరములు ధరించియుం డియు పుత్రోత్పత్తి కాక దుఃఖపడినది. కుంతీదేవికి పుత్రుడు పుట్టుట విని తన గర్భము కదలిక లేక స్థిరమై యుండుటను జూచి చింతించి దుఃఖాతిరేకమున గర్భతాడనము జేసికొనెను. అని తాత్పర్యము.

దీనిని బట్టి చిరకాలగర్భధారణక్లేశ మనుభవించుచున్న గాంధారి కంటె ముందుగా కుంతీదేవికి పురుడు వచ్చుటను బట్టియు, తనకు పురుడు వచ్చు సూచన గోచరింపకుండుటనుబట్టియు పరితాపము హెచ్చి

యట్లు చేసినదని తెలియుచున్నది. గర్భవతులకు గాలాతిక్రమణ మైన కొలది భారముచే క్లేశము కలుగుచుండుటయు, నందులో నొకరు ప్రసవించినపుడు తమ కట్టి ప్రసవసమయము రాకపోయెనని దిగులు పడుచుండుటయు సహజము. అట్టి దిగులే గాంధారికి సంభవించినది. ఆపై గర్భమునకు చలనము కూడ లేకున్నపుడు ఆమె కెంతయైన పరితాప ముండును. కనుక ప్రతివాదులు 'కుంతి బిడ్డల గనుచున్న దని గాంధారి కడుపు బాదుకొనె' నని వ్రాయబడినట్లు తెలుపుట అక్రమము. ఇక గర్భతాడనము కాగా జరిగిన విషయ మేమో చూడుడు—

"తతో జజ్ఞే మాంసపేశీ లోహాష్ఠీలేవ సంహతా ।
ద్వివర్ష సంభృతా కుక్షౌ తా ముత్స్రష్టుం ప్రచక్రమే ॥
అథ ద్వైపాయనో జ్ఞాత్వా త్వరిత స్సముపాగమత్ ।
తాం స మాంసమయీం పేశీం దదర్శ జపతాం వరః ॥
తతోఽబ్రవీ త్సౌబలేయీం కి మిదం తే చికీర్షితమ్ ।
సా చాత్మనో మతం సత్యం శశంస పరమర్ష యే ॥
జ్యేష్ఠం కున్తీసుతం జాతం శ్రుత్వా రవిసమప్రభమ్ ।
దుఃఖేన పరమే ణేద ముదరం ఘాతితం మయా ॥
శతం చ కిల పుత్రాణాం వితీర్ణం మే త్వయా పురా ।
ఇయం చ మే మాంసపేశీ జాతా పుత్రశతాయ వై ॥"

టీ.—లోహాష్ఠీలా=లోహమయా గండికా; తద్వత్సంహతా= కఠినా.

గర్భతాడనమువలన లోహఖండమువలె కఠినమైన మాంసపేశి బహిర్భూతము కాగా రెండుసంవత్సరములు కుక్షియం దుండి తుద కారూపములో వెలువడిన మాంసపేశిని పారవేయుటకు గాంధారి యత్నించునంతలో వ్యాసభగవానుడు తెలిసికొని ప్రత్యక్షమై మాంస పేశిని జూచి గాంధారీ! నీవిట్లు చేసితి వేమని యడుగ ముందుగా కుంతీదేవి ప్రసవించి చక్కని పుత్రుని కన్న దని విని నే నిట్లే యుండి పోతి సని పరమదుఃఖముచే గర్భతాడనము జేసికొంటి నని సత్యము చెప్పి మహర్షీ! నాకు నూర్గురు పుత్రులు కలుగుదు రని వరమిచ్చితివి. దానికి బదులు నాకీమాంసపేశి కలిగినది. అని పలుకగా మహర్షి—

"ఏవ మేత త్సౌబలేయి నైత జ్జా త్వన్యథా భవేత్ ।
వితథం నోక్తపూర్వం మే స్వైరేష్వపి కుతోఽన్యథా ॥"

గాంధారీ! ఆ పుత్రశతము దీనినుండియే యుద్భవించును. నే నెన్నడును అసత్య మాడినవాడను గాను. అని చెప్పి మహర్షి స్వయముగనే యామాంసపేశిని శీతోదకముతో తడిపి, అంగుష్ఠపర్వప్రమాణముగల భాగములుగా విడదీసి యొక్కొక్కభాగమును ఒక్కొక్కఘృతకుంభమునందు పెట్టించి పదిలముగా కాపాడవలసిన దని చెప్పి అంతర్ధాన మయ్యెను. ఈ విషయ మీ శ్లోకములలో నున్నది—

"తాం మాంసపేశీం భగవాన్ స్వయమేవ మహాతపాః ।
శీతాభి రద్భి రాసిచ్య భాగం భాగ మకల్పయత్ ॥
యో యథా కల్పితో భాగ స్తం తం ధాత్ర్యా తథా నృపః ।
ఘృతపూర్ణేషు కుండేషు ఏకైకం ప్రాక్షిప త్తదా ॥" (ఆది అ116)

ఈ కథాసందర్భము జూడగ గాంధారిచే నారాధింపబడినవాడును, గాంధారికి పుత్రశతవర మిచ్చినవాడును, ఆ మాంసపేశిని స్వహస్తములతో విభజించి యిచ్చి పుత్రుల నావిర్భవింపజేసినవాడును వ్యాసభగవానుడే యని స్పష్ట మగుచుండ నామహర్షికి గాంధారియందీర్ష్య యనియు, నది దుర్యోధనుని యందలి యీర్ష్యనుబట్టి కలిగిన దనియు నున్న ప్రతివాదుల వ్రాత నింద్యము. దుర్యోధనుడు పుట్టక పూర్వము పుట్టినది మాంసపేశి. అది గర్భతాడనమునుబట్టి పుట్టినది. ఆ గర్భతాడనకథనములో 'దుర్యోధనునియందు గల యీర్ష్యను గాంధారియందు దొరలించెను' అన్న ప్రతివాదులకు వెఱ్ఱియా? బుద్ధియా!

కడుపు బాదుకొని మాంసఖండము గనినదని ప్రకృతివిరుద్ధపు గాధ నొకదానిని కల్పించిరట "ప్రకృతిసిద్ధ మిదం హి దురాత్మనామ్" అన్నారు కనుక నందఱిప్రకృతులు నొకవిధమైనవి కావు. అందుచే పతివ్రాదుల ప్రకృతికి విరుద్ధమైనను యన్యుల ప్రకృతికది యవిరుద్ధమే. ఈ స్కాందపురాణవచనములను కూడ జూడుడు—

"మాయామయ మిదం విశ్వం దృశ్యతే శ్రూయతేచ యత్ ।
కిం భావ్యం కి మభావ్యం చ సంసారేఽస్మిన్ క్షణాత్మకే ।

అనిరూప్య మభూతార్థం మాయయా జాయతే స్ఫుటమ్ ।
ఈశ్వరస్య వశే మాయా తస్య కో వేద చేష్టితమ్ ।
దేవతానాం మహర్షీణాం శాపేనచ వరేణచ ।
అయుక్త మపి యత్కర్మ యుజ్యతే నాత్ర సంశయః ॥"

అనగా నీప్రపంచ మంతయు మాయామయము. క్షణభంగుర మైన యీ సంసారమం దేమూలనో పుట్టిపోవువారికి సంభావ్య మేమి? అసంభావ్య మేమి? అనిరూప్యము, అభూతపూర్వము నైనది మాయచే స్ఫుటముగా గలుగుచున్నది. అట్టిమాయ యీశ్వరున కధీనము. ఆ యీశ్వరుని చర్య యెవ్వని కెరుక? దేవతలయొక్కయు, మహర్షుల యొక్కయు శాపముచేగాని, వరముచేగాని అఘటితఘటన జరుగును. సంశయము లేదు. అని భావము.

కనుక, మాంసపేశి కలిగిన దనుట ప్రకృతివిరుద్ధమను ప్రతివాదులకు శాస్త్రజ్ఞానము, తన్మూలకమగు లోకజ్ఞానము లేనందున వారి వ్రాత హేయము.

ఇట్లు పూర్వోక్తప్రకారము వ్యాసమహర్షి యనుగ్రహమున గాంధారికి దుర్యోధనాదిపుత్రశతము ఏకగర్భముననే యీ మాంసపేశి నుండి జన్మించె నని తెలిసినది. ఈశ్లోక మందీవిషయము చెప్పబడినది.

"కథితో ధార్తరాష్ట్రాణా మార్ష స్సంభవ ఉత్తమః ।
అమనుష్యో మనుష్యాణాం భవతా బ్రహ్మవాదినా ॥"

టీ॥ ఆర్షః=ఋషిప్రసాదహేతుకః;అమనుష్యః=మనుష్యేష్వదృష్టః; యుగప ద్బహూనాం జననాత్ ॥ ఈ శ్లోకవిషయముచే-

"ఈమె (గాంధారి) కుమారులలో నల్వురే యౌరసులుగా గాన్పింతురు. ఔరసులుండినను స్వయందత్తాదులను పుత్రులుగా నంగీకరింప పూర్వస్మృతు లంగీకరించుచున్నవి. ఈ స్వయందత్తాదు లన్యజాతిజులుగా గూడ నుండవచ్చును. ఇట్టివారే గాంధారియొక్క తొంబదియారుగురు పుత్రులును." (పు 268) అను మ. భా. చ. కారుల యుపసంగతప్రసంగ మహాస్త్రము.

—• గాంధారీపుత్త్రుల కపార్థముల నిచ్చు నామములను వ్యాసాదులే పెట్టిరను ప్రసంగము—తన్నిరాకరణము •—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—

గాంధారీపుత్త్రుల కపార్థముల నిచ్చు దుర్ముఖాదినామములను వ్యాసాదులు కల్పించియుందు రని తలతును. నామకరణము జేయునపుడు గృహ్యసూత్రకారులు శుభచిహ్నముగా నుంపు మనిరే కాని యశుభచిహ్నముగా నుంపు మన లేదు పెంటయ్య గొందలగు నవీననామములును, శునశ్శేపాదిప్రాచీననామములును, కారణాంతరముచే బెట్టబడియుండును. వ్యాసాదులు దుర్యోధను పక్షము క్రింద పరచు రీతిని వ్రాసిన ప్రక్రియమును గమనింప కుండాశ్యాదినామములు వ్యాసకృత ములని చెప్పవలసియున్నది.'' (పు. 269)

ఈ మ. భా. చ. కారులే గాంధారీధృతరాష్ట్రుల కౌరస పుత్త్రులు నలువురే యనియు, వారు దుర్యోధన, దుశ్శాసన, వికర్ణ, చిత్రసేను లనియు, మిగిలిన 96 గురు స్వయందత్తాదులనియు(పు.105) వెనుక వ్రాసి యున్నారు.

ఇప్పు డిచ్చట గాంధారీపుత్త్రుల కపార్థ మిచ్చు దుర్ముఖ కుండాశ్యాది నామములను వ్యాసుడు కల్పించె నని వ్రాసినారు. ఆ దుర్ముఖ కుండాశ్యాదినామధారులు ప్రతివాదుల వ్రాతను బట్టి గాంధారీ గర్భ సంభూతులు కారు. గాంధారీగర్భసంభూతు లగు దుర్యోధన, దుశ్శాసన, వికర్ణ, చిత్రసేనుల నామములు అపార్థ మిచ్చునవి వ్యాసునిచే గల్పింపబడినవి. యని ప్రతివాదులే అనలేదు.

ఇట్టిస్థితిలో కథానాయకు లగు దుర్యోధన, దుశ్శాసనాదులకే అపార్థ మిచ్చెడి నామములను కల్పించి యెరుగని మహర్షి—యప్రసిద్ధులైయున్న దుర్ముఖాదులకు ఆ నామములు కల్పించునా?

ఇంకొకటి-దుర్యోధన దుశ్శాసననామములను వారి తల్లితండ్రులే పెట్టుకొనియున్నట్లు దుర్ముఖాదినామములు వారల తల్లిదండ్రులే పెట్టుకొనినవి యేల గావు? ఇంకొకటి దుర్ముఖాదినామములు వ్యాసకల్పితము లనువారు వారి కసలు తల్లితండ్రులు చేసిన నామకరణ మేదో చెప్పగలరా? శునశ్శేఫాది నామములకు ప్రతివాదులే కారణాంతర మున్నదనిరో అదియే ఈ దుర్ముఖాదినామములకుగూడ గారణమేలగాదు? కనుక నీప్రతివాదుల యసందర్భపు వ్రాతనింద్యము.

—• పరాశరుడే సమస్తపురాణప్రవర్తకుడు కాని కృష్ణద్వైపాయనుడు కాడను ప్రసంగము—తన్నిరాకరణము •—

మ ఖా. చ కారుల వ్రాత యిట్లున్నది—

**పరాశరుడే సమస్తపురాణ ప్రవర్తకుడని విష్ణుపురాణములో గలదు. వ్యాస బిరుదముచే సమస్తపురాణకర్తృత్వము కృష్ణద్వైపాయనునకే స్థూలదృష్టిచే లోకము కట్టిపెట్టుచున్నది. విష్ణుపురాణములోని ఈ యంశమును జెప్పు పరాశరవాక్యము లగు రెండు పద్యములు నిట వ్రాయుచున్నాను—**

**మ. విను మైత్రేయ! మదీయశైశవకథావృత్తాంత మంభోరుహా**
**సనపుత్రుండు జగన్నుతుం డగు పులస్త్యబ్రహ్మ యేతెంచి మ**
**న్నన శేపారగ నన్ను గన్గొని పురాణశ్రేణికిన్ గర్తవీ**
**వని వాకున్ వరమిచ్చి పోయె బ్రియవ్యాపార మేపారగన్.**

**క. అది కారణంబుగా నా కొదవె పురాణప్రవీణయోగ్యత నీవ**
**ట్టిది గోరి నన్ను నడిగితి వది నీకుం జెప్పువాడ నాద్యంతంబున్.**

**పై కారణములచే బురాణకర్త యగు వ్యాసుడు పరాశరుడే కాని కృష్ణద్వైపాయనుడు కాడు" (పు. 141)**

ఆహా! కృష్ణద్వైపాయనుడు సమస్తపురాణకర్త యని లోక మనుచున్న దని జెప్పుచు నాతడు పురాణకర్త కాడను ప్రతివాదులు లోకాతీతు లన్నమాట స్థూలదృష్టిచే లోక మనుచున్న దనుటవలన వీరి కాస్థూలదృష్టి లేదన్నమాట. పరాశరుడు పురాణకర్త యని చెప్పు పద్యములకు కృష్ణద్వైపాయనుడు పురాణకర్త కాడని యర్థ మన్న మాట. వీరికి లోకానుసరణముతో బని లేదన్నమాట. ఆవిష్ణుపురాణము లోనే ముం దేమున్నదో చూచుకొనవలసిన పని కూడ లేదన్నమాట. ఇదియే విమర్శకలక్షణ మన్నమాట. కానిండు. మన మిప్పుడు లోక మనుచున్నది నిజమో, ఈ లోకాతీతు లన్నది నిజమో వారుచూపిన విష్ణుపురాణమును బట్టియే నిర్ణయింతము.
చతుర్థాశ్వామం దిట్లున్నది—

ఈ వైవస్వతమన్వంతరమం దతీతము లయిన అష్టావింశతి (28) మహాయుగంబులలోని ద్వాపరయుగములందు గల వ్యాసులను మైత్రేయునకు పరాశరు డుపదేశించు ప్రస్తావములో—

"మజ్జనకుండైన శక్తియును, నేనును,జాతుకర్ణుండును, మత్పుత్రుండయిన కృష్ణద్వైపాయనుండును వేదవ్యాసరూపంబులు ధరిచి వేద వేదాంగ ధర్మశాస్త్రపురాణాగమంబులు మొదలుగా బదునెనిమిది విద్యలు జగంబులం బ్రసిద్ధంబు జేసితిమి. ద్రోణపుత్రుం డయిన యశ్వత్థామ ముందటి ద్వాపరయుగంబున వేదవ్యాసుండు కాగలవాడు" అని చెప్పబడినది.

దీనినిబట్టి యీమన్వంతరములోనిప్పటి కిరువదియెనిమిది ద్వాపర యుగములుగడచినవనియు, నొక్కొక్క ద్వాపరయుగమందొక్కొక్క తపోధనుడు వేదవ్యాసుడగుచు పురాణములురచించి యష్టాదశవిద్యలను లోకమున వ్యాపింపజేయుచుండు ననియు, నట్లుపరాశరుడు వెనుక నొక ద్వాపరమున వేదవ్యాసుడును, కృష్ణద్వైపాయనుడీ కలియుగమునకు వెనుకటి ద్వాపరమందు వేదవ్యాసుడును అయియుండి రనియు స్పష్టమైనది. ఇప్పుడు పరాశరు డెట్లు సమస్తపురాణకర్తయో అట్లు కృష్ణద్వైపాయనుడునుసమస్తపురాణకర్తయే. ప్రతివాదులు చూపిన పద్యములు పరాశరుడు పురాణకర్త యనునవేకాని కృష్ణద్వైపాయనుడు పురాణ కర్త కాడనునవి కావు ఇప్పుడు లోకమనుచున్నదే నిజమైనది లోకము ననుసరింపనివారి పాట్లు తుద కిట్టివే. దీని నింతమాత్రముతో విడిచి విషయాంతర మందుకొందము.

—: బ్రహ్మసూత్రకర్త కృష్ణద్వైపాయనుడు కాడను ప్రసంగము తన్నిరాకరణము :—

వ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—

**"బ్రహ్మసూత్రకర్తయగు బాదరాయణుడు కృష్ణద్వైపాయనుడు కాడని లోకమాన్యతిలకుగారు గీతారహస్యములోను, శ్రీపురాణపండ మల్లయ్యశాస్త్రిగారాంధ్రబ్రహ్మసూత్రభాష్యటీకలోను స్పష్టపరచిన సంగతి జదువగా బ్రహ్మసూత్ర కర్తృబాదరాయణసంబంధము సార్థకచేయువకు లేదని తెలియును" (పు 144)**

ఈ ప్రతివాదుల మాట యెంత సత్యమో వీ రుదాహరించిన గ్రంథములు చూచిన తేలును. అందుకై క్రమముగా నా గ్రంథముల లోని నిర్ణయము ప్రదర్శింపబడుచున్నది—

గీతారహస్యపరిశిష్టము— పు. (734)

"మామతమున నీసందేహము నివృత్తియగుటకు మార్గ మొక టియే యున్నది. బ్రహ్మసూత్రములను రచించినవారే మూలభారత మును, గీతలనుకూడ ప్రకృతమున్నరీతిగ రచియించినా రందుమేని యేమియు విరోధ ముండనేరదు. బ్రహ్మసూత్రములను వ్యాససూ త్రము లని చెప్పుట పరిపాటియై యున్నది. "శేషత్వా త్పురుషార్థ వాదో౽థాన్యే ష్వితి జైమినిః" అను వేదాంతసూత్రముయొక్క శాంకరభాష్యమునకు టీక జేయుచు 'జైమిని వేదాంతసూత్రకారులగు వ్యాసులకు శిష్యుడని యానందగిరి చెప్పెను మఱియు నారంభమందు చేసిన మంగళాచరణలో సైతము "శ్రీమద్వ్యాసపయోనిధి ర్నిధిరసౌ" అని బ్రహ్మసూత్రములను వర్ణించెను... ఈ విషయములను మనస్సున నునిచికొని విచారించితిమేని మూలభారతమునకును, తదంతర్గత గీతల కును, ప్రకృతమునందున్న స్వరూపమును వ్రాయుటయు, బ్రహ్మ సూత్రములను రచించుటయు నను కార్యముల నొక బాదరాయణు లగు వ్యాసులే చేసియుందురని యూహింపవచ్చును"

ఇది తిలకుగారు గీతారహస్యములో స్పష్టపరచిన సంగతి, యిందులో బ్రహ్మసూత్రకర్త యగు బాదరాయణుడు వ్యాసు డన బడు కృష్ణద్వైపాయనుడే యని నిర్ణయింపబడినదికదా.

రెండవదానిని జూడుడు—

ఆంధ్రబ్రహ్మసూత్రభాష్యపీఠిక—"ఏదియెట్లున్నను సంప్రదా యజ్ఞులగు భాష్యవ్యాఖ్యాతలు సూత్రకర్త వ్యాసులే యని చెప్పుటచే తను, పౌరాణికులును వ్యాసబాదరాయణు లొక్కరే యని వ్యవహరిం చినట్లు కాన్పించుటచేతను వారిద్దరు నొక్కరే యను నిర్ణయము చేయ వలసియున్నది"

ఇది మల్లయ్యశాస్త్రిగారి పీఠిక. దీనిలోగూడ వ్యాసబాదరా యణు లొక్కరే యని నిర్ణయింపబడినదికదా! ఈగ్రంథములు రెండును

బ్రహ్మసూత్రములు వ్యాససూత్రములే యని చెప్పుచుండ వ్యాససూత్రములు కావని చెప్పుచున్నవని వంచకులై యెంత యన్యాయముగా వ్రాసిరో చూడుడు.

వీరు 27-12-45 తేదీనుండి ఆంధ్రపత్రికలో 'బాదరాయణుడు వ్యాసుడు కాడు' అను పేరుతో వ్యాసములు ప్రకటించినారు. ఆవ్యాసములలోని విషయము లసంగతము లని నిరూపించుచు 'కల్పవల్లి' 'దివ్యవాణి' పత్రికలలో ప్రకటించితిని. తరువాత 4-5-47 తేదీ శ్రీ అన్నవరదేవస్థానమున విద్వత్సభలో సభ్యులకోరికపై ముగ్గురు మధ్యవర్తులను పురస్కరించుకొని వాదోపవాదతత్త్వనిర్ణయము చేయ సకల్పింపబడినది. అప్పుడు ఆంధ్రపత్రికలో ప్రకటించిన వ్యాసములనే వారు చదువగా, నేప్రకటించిన ఖండనవ్యాసములు నేను చదివి యాపై యనేకప్రమాణములను గూడ నప్పుడు ప్రదర్శించితిని. ఆవాదోపవాదముల స్వరూపము, ఆమధ్యస్థుల తీర్మానములు 'బ్రహ్మసూత్రకర్తృనిర్ణయము' అను గ్రంథమున ఈగ్రంథము (ఈపుస్తకము నకు చివర అనుబంధముగా చేర్చబడి యున్నది. విశదము కాగలవు.) కనుక బ్రహ్మసూత్రకర్త వేదవ్యాసమహర్షియే యనుటకు మనకు ప్రమాణము ప్రతివాదులు పరిగ్రహించిన గ్రంథములే యగుటచే నితోఽధిక నిరూపణముతో బనిలేకయే ప్రతివాదుల వ్రాత నిరస్తమైనది.

—॰ వ్యాసభగవానుని ఘనత. —

మన మిప్పుడొకసారి వ్యాసభగవానుని ఘనత ననుసంధింతము. వేదవిభాగము జేసెను; బ్రహ్మసూత్రములు నిర్మించెను; అష్టాదశమహాపురాణములు రచించెను; మహాభారతము ననుగ్రహించెను; తనయున న్యసాధారణతపశ్శక్తిచే ధృతరాష్ట్రాదులకు యుద్ధమృతుల జూపి పరస్పరసంభాషణాదుల జరిపించెను; జాత్యంధునకు దృష్టి నప్పు డనుగ్రహించెను; సంజయునకు యుద్ధమందలి యావద్వృత్తాంతము కరతలామలకముగా దెలిసికొనుటకు దివ్యదృష్టి బ్రసాదించెను; గాంధారికి

బుతప్రతోత్పత్తివరమిచ్చెను; బహిర్యాతమై, యగోచరమై, యతికఠినమై యున్న మాంసపేశిని శీతోదకసేచనముతో నంగుష్టపర్వప్రమాణముగా విభజించి దుర్యోధనాదుల నుత్పాదింపజేసెను. ఎప్పటికప్పుడుతనయోగ శక్తిచే బ్రత్యక్షమగుచు వచ్చెను. పరాశరపుత్రుడై, యాజన్మసిద్ధుడై స్వయంప్రతిభాతవేదమంత్రవిరాజితుడై, బ్రహ్మర్షియై, శ్రీహరియవ తారమై, జీవన్ముక్తుడై, లోకోద్ధరణదీక్షాధురంధరుడై, దీనావనతత్ప రుడై, త్రికాలజ్ఞాననిధియై విలసిల్లెను. ఇట్టి మునిజనమూర్ధన్యుని, ఇట్టి జగద్వంద్యుని యీప్రతివాదు లేమని నిందించిరో యిపు డొక్కసారి మనము స్మృతిపథమునకు దెచ్చుకొందము.

—ప్రతివాదవైఖరి—

వ్యాసుడు నిషాదు డనిరి; చండాలజాతిజు డనిరి; రాణివాసము జేరి రాణుల గూడినా డనిరి; దుర్వాసన కలవా డనిరి; మఱియొక ప్పుడున స్త్రీలోలుడే యనిరి: ధర్మప్రతిపాదకస్వభావుడు కాడనిరి; కాశీప్రభువుచే కాశీనుండి తరుమబడె ననిరి; కాశీలో భిక్షకూడ దొరక లేదనిరి; దుర్యోధనాదుల భార్యలను పతిలోకము కలుగునని నమ్మించి గంగలో బ్రవేశపెట్టె ననిరి; భారతమును పాండవపక్షముగా వ్రాసినా డనిరి; తాను సంకీర్ణజాతివాడు కనుక సంకీర్ణజాతివారగు పాండవులకు దోడ్పడినా డనిరి; కౌరవపాండవుల న్యాయాన్యాయములు వ్యత్యస్త ముజేసి భారతము వ్రాసినా డనిరి; దుర్యోధనునియం దీర్ష్య కలవా డనిరి; ఆయీర్ష్యను గాంధారియందుకూడ జూపి యామె గర్భతాడన ము జేసికొన్నదని వ్రాసినా డనిరి; గాంధారీపుత్రుల కపార్థమిచ్చు నామములను పెట్టినాడనిరి; బ్రహ్మసూత్రకర్త యీతడు కాడనిరి; పురాణము లీతడు రచించినవి కావనిరి.

ఈనింద లన్నియు ప్రమాణోపపత్తులతో, స్వవచనవ్యాఘాత ములతో, స్వోదాహృతవచనవిరోధములతో నిరాకృతము లయినవి.

మహర్షి తత్త్వము మ. భా. చ. కారుల మతిరాహిత్యము అభివ్యక్త మయినది.

ఈప్రస్తావములో మహాభారతవచనములు కొన్ని స్మృతికి వచ్చుచున్నవి.

'అన్యాన్ పరివదన్ సాధు ర్యథా హి పరితప్యతే ।
తథా పరివద న్నన్యాం స్తుష్టో భవతి దుర్జనః ॥
అభివాద్య యథా వృద్ధాన్ సంతో గచ్ఛంతి నిర్వృతిమ్ ।
ఏవం సజ్జనమాక్రుశ్య మూర్ఖో భవతి నిర్వృతః ॥
అతో హాస్యతరం లోకే కించి దన్య న్న విద్యతే ।
యత్ర దుర్జన మిత్యాహ దుర్జన స్సజ్జనం స్వయమ్ ॥
సత్యధర్మచ్యుతా త్పుంసః క్రుద్ధా దాశీవిషాదివ ।
అనాస్తికోఽప్యుద్విజతే జనః కిం పున రాస్తికః ॥' (ఆది. అ. 74)

టీ. అనాస్తికః=ఆస్తికా ద్భిన్నః ॥

ఇతరులను నిందించి సజ్జను డెంత పరితపించునో, దుర్జను డితరుల నిందించి యంత సంతోషించును. పెద్దలకు నమస్కరించి సజ్జను లెంత యానందింతురో, సజ్జనుల నిందించి దుర్జను డంత యానందించును. దుర్జనుడు సజ్జనుని దుర్జను డని చెప్పుచుండును. ఇంతకంటె లోకమం దపహాసపాత్రము మరియొకటి లేదు. క్రోధము కల విషసర్పమువలన భయపడినట్లు సత్యమును, ధర్మమును విడిచిపెట్టిన మనుజునివలన నాస్తికుడు కూడ భయపడుచుండును. ఆస్తికుని మాట నిక నేమి చెప్ప వలెను? అని భావము. వేదవ్యాసభగవానుని దిగంతవిశ్రాంతమైన యశస్సును తిరస్కరింపబూనిన ప్రతివాదుల చర్య యెట్టిదో తెలియుటకై యీసందేశపశారీరకాచార్యసూక్తి నవలోకింపుడు!

'మహామహిమ్నా మపి య శ్చకీర్షతి
స్వభావసంశుద్ధతరం తిరోయశః ।

స నూన మాచ్ఛాదయితుం సమీహతే
వివస్వతో హస్తతలేన మండలమ్ ॥'

స్వభావసిద్ధమై, అతిసంశుద్ధమై యున్న మహామహిమ కలవారల యశస్సు నెవ్వడు తిరస్కరింపదలచునో వాడు జగత్ప్రకాశకమైన సూర్యమండలమును గప్పివేయుటకై తన యరచేతిని యడ్డుపెట్టుటకు దలపెట్టినవా డగును. అని భావము.

ఈప్రతివాదులు వేదవ్యాసభగవానుని నిందించుట, ప్రమాణ గ్రంథములను తిరస్కరించుట, విద్వన్మార్గమును ద్వేషించుట మొదలగు చర్యలు చూడగా 'సుభాషితరత్నభాండాగారములోని యొక మహాకవిసూక్తి జ్ఞప్తికి వచ్చుచున్నది.

'వ్యాసాదీన్ కవిపుంగవా ననుచితై ర్వాక్యైః స్సలీలం హస
న్నుచ్చై ర్జల్ప నిమీల్య లోచనయుగం శ్లోకాన్ సగర్వం పఠ ।
కావ్యం ధిక్కురు యత్పరై ర్విరచితం స్పర్ధస్వ సార్థం బుధైః
య ద్యభ్యర్థయసే శ్రుతేన రహితః పాండిత్య మాప్తుం బలాత్ ॥

ఓజనుడా! చదువులేని నీవు పాండిత్యమును బలాత్కారముగా సంపాదింపగోరెదవేని యీ యుపాయముల నాశ్రయింపుము. ఏవనగా—వ్యాసాదికవిపుంగవులను నవ్వుచు నిర్లక్ష్యముగా ననుచితప్రసంగములకు పాలుచేయుము! (అనగా నిందింపుము) కన్నులు మూసికొని యేవో శ్లోకములను గర్వముతో జదువుము. అన్యులు రచించిన గ్రంథములను ధిక్కరింపుము! విద్వాంసులతో స్పర్ధ కలిగియుండుము! ఇట్లు చేయుదువేని విద్యలేకపోయినను నీవు పండితుడ వనిపించుకొనగలవు. అని తాత్పర్యము.

'బాలవ్యాస, తర్క, వ్యాకరణ, వేదాంత కేసరి' వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిప్రణీతమైన, మహాభారతతత్త్వకథనమున
వేదవ్యాసనిందానిరాకరణ మనెడి
ద్వితీయభాగము సమాప్తము.

---

# బ్రహ్మసూత్రకర్తృనిర్ణయము.

మహాభారతచరిత్రకారు లగు పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు 2౮-12-.915, ౯-1-1916, ఆంధ్రపత్రికలలో బ్రహ్మసూత్రకర్త యగు బాదరాయణుడు వేదవ్యాసుడు కాడనుచు వ్యాసములు వ్రాసి వారివాదమునకు బలకరముగా 14 కారణములు చూపియున్నారు ఆవాదము విద్వత్సిద్ధాంతవిరుద్ధమనియు, ఆ 14 కారణములు వారివాదమును సమర్థింపలేనట్టి వనియు 'కల్పవల్లి' 'దివ్యవాణి' పత్రికలలో నిరూపించి బ్రహ్మసూత్రకర్త యగు బాదరాయణుడు వేదవ్యాసుడే యని ప్రకటించియున్నాము ఇప్పుడు వాని సారాంశము పాఠకలోకమునకు విషయపరిజ్ఞానముకొఱకు ప్రకటింపబడుచున్నది —

—ప్రతివాదుల ప్రతిజ్ఞావాక్యమిది—

"ఇప్పటికి రమారమి ఏడుశతాబ్దములనుండి వ్యాస-బాదరాయణుల నేకవ్యక్తిగా దలచి సంస్కృతాంధ్రగ్రంథకర్తలు వ్యాసులే బాదరాయణులు అని వ్రాయుచున్నారు కాని అది తప్పని మల్లినాథ-వేంకటాధ్వర్యాది సంస్కృతపండితులకును, తిక్కన-శ్రీనాథాది ఆంధ్రమహాకవులకును వ్యతిరేకముగా నీక్రింది 14 కారణములచే వ్రాయ సాహసించుచున్నాడను"

ఈ వాక్యము ప్రతివాదుల వ్రాత, సంస్కృతాంధ్రగ్రంథకర్తలకువిరుద్ధ మనియు, సాహస మనియు స్పష్టీకరించుచునే యున్నది

—ప్రతివాది ప్రసంగము—

వారు చూపిన కారణము లివి.—

1 మహాభారతములో వ్యాసుని బాదరాయణశబ్దముచే నెచ్చటను పిలువలేదు

2 ఎచ్చటను నన్నయ, వ్యాసులవారిని బాదరాయణు లనలేదు.

3 క్షేమేంద్రకవి, తన భారతమంజరిలోగాని, వ్యాసాష్టకములో గాని వ్యాసులను బాదరాయణు లనలేదు.

4 మహాభారతమున వ్యాసులవారి యుపదేశము లెచ్చటజూచినను కర్మములను, కర్మఫలానుభవములను బోధించునవియే గాని బ్రహ్మపదప్రాప్తిబోధకములు గావు.

ఆతని ముఖ్యశిష్యుడగు జైమినిమహర్షి గురుచరణాను యాయియో అన్నట్లు కర్మప్రబోధకరమగు పూర్వమీమాంసా శాస్త్రకర్తయై యున్నాడు.

భగవద్గీతయును కర్మయోగమునే చెప్పునని తిలకుపండి తులవంటి మహామేధావుల అభిప్రాయము.

వ్యాసమహర్షి అర్థకామ ప్రబోధకుడె కాని ధర్మమోక్ష ప్రబోధకుడు కాడని ఉమాకాంత పండితుడు కొన్నివ్యాస ములు వ్రాసెను.

5 శ్రీతిలకు పండితుడు తన గీతారహస్యమున వ్యాసబాదరాయ ణులు వేఱు వ్యక్తులనియు బాదరాయణులవారిని వ్యాసశబ్దవా చ్యునిగా నిటీవలి గ్రంథకర్తలు వ్రాసియుందురనియు వ్రాసిరి.

6 పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు తమ ఆంధ్రబ్రహ్మసూత్ర పీఠికలో వ్యాసబాదరాయణ వ్యక్తులు వేరని వ్రాసిరి.

7 ఆంగ్లమున బహుగ్రంథములు రచించిన పండిత సీతానాథతత్త్వ భూషణులు తమఆంగ్లబ్రహ్మసూత్రభాష్యపుపీఠికలో బాదరాయ ణులువ్యాసులు కారని నిరూపించి వ్రాసియున్నారు

8 శ్రీశంకరాచార్యులవారు తమ బ్రహ్మసూత్రభాష్యమునందు బాదరాయణమతమును సమర్థింప భారతమునుండియు, భగవద్గీత నుండియు నుదాహరణముల నిచ్చియుండుటచే శంకరమతమున గూడ వ్యాసబాదరాయణ వ్యక్తులు వేఱనుట స్పష్టము.

9 మహాభారతమీమాంసాకర్త యగు సప్రేపండితుడు బాదరాయ ణుడు క్రీ॥పూ॥ 3వ శతాబ్దములో నుండె ననివ్రాసియున్నారు.

10 బాదరాయణశబ్దమునకు 'బదరీవనమున నుండువాడు' అని వ్యు త్పత్తిం జెప్పుదురు. ద్వైపాయనశబ్దమునకు 'ద్వీపమున నుండు వా' డని వ్యుత్పత్త్యర్థము జెప్పుదురు.

బదరీవనము గంగానదీతీరమున గలదు. ద్వీపము యము నానదిలోనిది. రెంటికి సంబంధ మెట్లు?

11 పై యంశములకంటె నా కెక్కుడు నమ్మిక గల్గించినది-- బాదరాయణులు, వ్యాసశిష్యులలో పూర్వమీమాంసాకర్త యగు జైమినిమతమును 'ధర్మం జైమిని రత ఏవ' ఇత్యాదులలో పూర్వాచార్యమతముగా దలచుట.

బాదరాయణులు వ్యాసులవారే యైనచో తన శిష్యుడగు జైమినిమతమును పూర్వాచార్యమతముగ నెట్లు తలచును?

12 నడాదిగణములోని బదరశబ్దమునుండి 'నడాదిభ్యః ఫక్' అను సూత్రముచే బదరుని మనుమ డనియో, ముమ్మనుమ డనియో అర్థము కల బాదరాయణశబ్దము ఏర్పడును.

13 బాదరాయణులవారు తమ బ్రహ్మసూత్రములలో తమ తండ్రియో, తాతయో అగు 'బాదరి' మతమును గూడ పెక్కుసూత్రములలో జెప్పి యున్నారు.

పై కారణములచే 'బదరుడు' అను ఋషికి 'బాదరి' అను పుత్రుడును, బాదరాయణుడు మనుమండో, ముమ్మనుమండో యై యున్నా డనియు స్పష్టము.

14 వ్యాసమహర్షి తండ్రి పరాశరుడు; తాత శక్తిమహర్షి; ముత్తాత వసిష్ఠమహర్షి కదా. పై కారణములచే వ్యాసబాదరాయణ వ్యక్తులు భిన్ను లగుట నిజము. (ప్రథమవ్యాసము)

ద్వితీయవ్యాసము:—

సామవేదతాండ్యబ్రాహ్మణములోని వంశబ్రాహ్మణము—

'ప్రజాపతి బృహస్పతికిని, అతడు నారదునకును, నారదుడు విష్వక్సేనునకును, అతడు పారాశర్యవ్యాసునకును, అతడు జైమినికిని, అతడు పౌష్యంజ్యునకును, అతడు పారాశర్యాయణునకును, అతడు బాదరాయణునకును......ఈసామవేదము జెప్పిరి'

అని కలదు. పై బ్రాహ్మణవాక్యముల ననుసరించి వ్యాసులవారు బాదరాయణులవారికి నైదుతరముల పూర్వీకులును, జైమిని నాల్గుతరముల పూర్వీకుడు నై యున్నాడు.

పై పదునాల్గుకారణములచే వ్యాసబాదరాయణ వ్యక్తులు వేఱని దృఢమగుచున్నది.

ఇది పరిశీలనాయుగ మనవచ్చును. గ్రంథములను రోళ్లపాటగా గుడ్డివల్లన వేయువారికి సత్య మెట్లుతెలియును? కాన పరిశీలించిన వారికి వ్యాసబాదరాయణ వ్యక్తులు వేఱని బోధింపగలవు."

—ప్రతివాది ప్రసంగ నిరాకరణము—

ప్రతివాదుల 1. 2. 3. అంశములు సాధకములు కావు. మహాభారతకర్త నన్నయ, క్షేమేంద్రకవి, తమగ్రంథములలో వ్యాసుని బాదరాయణు డని చెప్పకుండుటే కాదు. బాదరాయణుడు కాడనియు చెప్పియుండలేదు. కనుక ప్రతివాదుల 1. 2. 3. కారణములు పరాస్తమైనవి.

4.వ అంశము అయుక్తము. మహాభారతకర్తయగు వ్యాసమహర్షి, బ్రహ్మసూత్రరచనాశక్తి లేనివాడనియు, అర్థకామప్రబోధకుడే యనియు దాని సారాంశము. ఇది విద్యాసంప్రదాయ మెరుగనివారి మాట కనుక హేయము.

5. 6. అంశములు అసత్యములు. శ్రీతిలకుగారును, శ్రీపురాణపండ మల్లయ్యశాస్త్రిగారును వ్యాస-బాదరాయణులు భిన్నవ్యక్తు లని కాక ప్రమాణములనుబట్టి ఏకవ్యక్తి యనియే యొప్పుకొనవలయు నని తమ మతములను ప్రకటించియున్నారు. ఆవిషయము వెనుక ప్రదర్శింపబడినదే.

7. వ యంశము సరియైనది కాదు. ఆ సీతానాథతత్త్వభూషణులు ఎట్లు నిరూపించి వ్యాస-బాదరాయణ-భేదమును స్థిరపరచిరో ప్రదర్శింపనందున నిదికూడ 5, 6 అంశములతోబాటుదే యని చెప్పవలసి యున్నది.

8. వ యంశము యుక్తము కాదు. శ్రీశంకరాచార్యులవారు బ్రహ్మసూత్రభాష్యములో భారత-భగవద్గీతా-వచనముల నుదాహరించుటలో గల తాత్పర్యము ఏమనగా: సూత్రకారుని గూఢాభిప్రాయము ఆసూత్రకారుని గ్రంథాంతరవచనములచే స్పష్టమగు నను తాత్పర్యమే.

అందుచేత భారత-భగవద్గీతా—బ్రహ్మసూత్రములకు కర్త యొక్కడనియే శ్రీశంకరమతము. భిన్నులని కాదు.

9. వ యంశము అయుక్తము. మహాభారతమీమాంసాకర్త యగు సహేత్రపండితుడు బాదరాయణుని స్థితి కాలమునుగూర్చి వ్రాసినట్లులేదు. వేదాంతసూత్రకాలమునుగూర్చి యిట్లు వ్రాసినారు—

'వేదాంతసూత్రములు, యోగసూత్రములును శకమునకు మునుపు రెండవశతాబ్దివి''

''వాల్మీకిరామాయణముయొక్క సమయము క్రీస్తుశకమునకు పూర్వము మొదటిశతాబ్ది యనియు, మహాభారతముయొక్క సమయము శకమునకు పూర్వము మూడవ శతాబ్ది యనియు మునుపు చెప్పియుంటిమి''

ఈ సహేత్రపండితుని వ్రాత ప్రతివాదుల కేమి సాధక మగును?

ప్రతివాదులు వ్రాసినట్లు జూచినను వ్యాస-బాదరాయణులకు భేద మేమి చెప్పబడినది?

10 వ యంశము సరియైనదికాదు బదరీవనమున నుండుటచే బాదరాయణు డని, ద్వీపమున నుండుటచే ద్వైపాయనుడని, చెప్పుట విరుద్ధము కాదు. యమునానదిలోని ద్వీపమునకును బదరీవనమునకును సంబంధములేకపోలేదు. శుత్రప్రకాశికోదాహృతమైన యీవచనము జూడుడు—

''ద్వీపే బదరికామిశ్రే బాదరాయణ మచ్యుతమ్॥
పరాశరా త్సత్యవతీ పుత్రం లేభే పరన్తపమ్॥

ఈశ్లోకముచే ద్వీపమందు బదరీవృక్షములున్న వనియే కాక పరాశరునివలన సత్యవతీదేవి అట్టిద్వీపమందు బాదరాయణుని గనినదనికూడ జెప్పబడినది. దీనివలన బాదరాయణుడే ద్వైపాయనుడు, ఆతడే పారాశర్యుడు. ఆతడే సాత్యవతేయుడు అని స్పష్టము.

11 వ యంశము అనుపపన్నము—బాదరాయణుడు తన బ్రహ్మసూత్రములలో "ధర్మం జైమిని రతఏవ" అనుచు వ్యాసశిష్యుడైన జైమినిని పూర్వాచార్యునిగా దలచినాడనుట అయుక్తము. ఆసూత్రములో జైమిని పూర్వాచార్యుడని యేమున్నది? జైమిని స్మరణము చేతనే జైమిని పూర్వాచార్యు డను పక్షములో, ఆబాదరాయణుడే తనసూత్రములలో "పూర్వ న్తు బాదరాయణో హేతువ్యపదేశాత్" అనుచు బాదరాయణుని స్మరించినందున సూత్రములో స్మరింపబడిన ఆబాదరాయణుడు సూత్రకర్తయగు బాదరాయణునకు పూర్వాచార్యు డనవలసినదే. ఇద్దరు బాదరాయణులను ప్రతివాదులొప్పుదురా?

కనుక "ధర్మం జైమిని రత ఏవ" అను సూత్రముచే జైమిని మతప్రదర్శనము, 'పూర్వన్తు బాదరాయణః ...' అను సూత్రముచే స్వమతప్రదర్శనము చేయబడిన దనియే తెలిసికొనవలెను.

12 వ యంశమును గూర్చి చెప్పుచున్నాము.

నడాదిగణములోని బదర శబ్దమునుండి "నడాదిభ్యః ఫక్" అను పాణిని సూత్రముచే బదరుని మనుమ డనియో ముమ్మనుమడనియో అర్థము కల బాదరాయణశబ్ద మేర్పడుట నిజమే కాని యీ, బదర సంతతికి జెందిన బాదరాయణుడే బ్రహ్మసూత్రకర్తయనుట నిరాధారము. ఆబాదరాయణశబ్దనిష్పత్తిని బట్టి యిట్లనవలె ననుటకు వీలులేదు. ఆశబ్దనిష్పత్తి మరియొక విధముగా గూడ గలుగుచున్నది.—

"తదస్మిన్న స్తీతి దేశే త న్నామ్ని" అను పాణినిసూత్రముచే 'బదర్యః సన్త్యస్మిన్ దేశే' అను వ్యుత్పత్తికలిగి బదరీశబ్దమునుండి బాదర శబ్దమేర్పడును. బదరీవృక్షములు కల దేశము దాని కర్థము. ఆపై 'బాదర + అయన' బాదరాయణః అని యగును. బదరీవృక్షములుకల దేశము స్థానముగా కలవాడు. అని దానికర్థము

"ద్వీపే బదరికామిశ్రే బాదరాయణ మచ్యుతం ।
పరాశరా త్సత్యవతీ పుత్రం లేభే పరన్తపమ్ ॥"

అని చెప్పబడిన బాదరాయణు డీతడే. ఈతడే పరాశరపుత్రుడును, సత్యవతీదేవి సుతుడును, కృష్ణద్వైపాయనుండును. బ్రహ్మసూత్రకర్త

యగు బాదరాయణుడు ఈతడే. బదర వంశీయ బాదరాయణుడు బ్రహ్మసూత్రకర్త కాడు.

13. 14. అంశములు అసంగతములు బాదరాయణులవారు తమ బ్రహ్మసూత్రములలో 'బాదరి' మతమును చెప్పిన మాట నిజమే కాని యా బాదరియు ఆబాదరాయణుడును బదర సంతతికి జెందినవారే యనుట అసంగతము.

బదర వంశీయ బాదరాయణుడు వసిష్ఠ సంతతికి జెందనివాడ యినను బదరీ వనవాసి బాదరాయణుడు వసిష్ఠ సంతతికి జెందినవాడే. బ్రహ్మసూత్రకర్తయగు బదరీ వనవాసి బాదరాయణుడును వేదవ్యాసుడును ఒక్కడే గనుక 'వ్యాసబాదరాయణ వ్యక్తులు భిన్నులు' అనుట అసంగతము.

ఇట్లు పరిశీలింపగా ప్రతివాదులు ప్రదర్శించిన 14. కారణములు ప్రతిహతము లయినవి. బ్రహ్మసూత్రకర్త యగు బాదరాయణుడు వేదవ్యాసుడే, అను విద్వత్సిద్ధాంతము అప్రతిహత మై యున్నది.

ప్రతివాదుల వంశబ్రాహ్మణోదాహరణమును గూర్చి చెప్పుచున్నాము.

ఆ వంశ బ్రాహ్మణమును బట్టి బ్రహ్మసూత్రకర్త యగు వారి బాదరాయణుడు పారాశర్య వ్యాసునికి క్రింద నయిదవతరము వాడును, వ్యాస శిష్యుడగు జైమినికి క్రింద నాల్గవతరము వాడును అగుచుండెను. అట్టి యా బాదరాయణుడు తన సూత్రములలో తనకు పూర్వుడగు జైమినిని స్మరించుట యుపపన్న మగును కాని ఆజైమిని తన సూత్రములలో "తత్ప్రమాణం బాదరాయణస్యా నపేక్షత్వాత్" (1-1-5) అని తనకు దిగువ నెక్కడనో నాల్గవ తరమువాడగు ఆ బాదరాయణుని స్మరించుట యెటులుపపన్న మగును?

అది యుపపన్న మగుటకై జైమినిచే స్మరింపబడిన ఆబాదరాయణుడు, ఆజైమినికి సన్నిహిత పూర్వముగా వంశబ్రాహ్మణములో నిర్దేశింపబడి పారాశర్య వ్యాసనామములతో బేర్కొన బడినట్టి ఆబదరీ వనవాసి బాదరాయణుడే యనుటకంటె గత్యంతర మేమున్నది?

ఇట్లు ప్రతివాదుల రెండు వ్యాసములలోని విషయమును చర్చిం పగా సంప్రదాయ సిద్ధమగు విద్వత్సిద్ధాంతమును ప్రతిఘటించు విమ ర్శకుల వాదము సాధక బాధక జ్ఞానరహితమనియు, నిస్సార మనియు స్పష్టమగుచున్నది.

— బ్రహ్మసూత్రకర్త యగు బాదరాయణుడు
వేదవ్యాసుడే అనుటకు ప్రమాణములు—

1 పద్మపురాణోత్తర ఖండః— అ 72.

'మహాభారత నిర్మాతా కవీంద్రో బాదరాయణః ।
కృష్ణద్వైపాయన స్సర్వపురుషార్థైకబోధకః ॥
వేదాన్తకర్తా బ్రహ్మైకవ్యంజకః పురువంశకృత్"

2 ఆ ది పు రా ణ మ్— అ. 1.

'కవీశ్వరం తం హి వందే ప్రవరం వై తపస్వినాం ।
తత్త్వజ్ఞానవతాం శ్రేష్ఠం కృష్ణద్వైపాయనం మునిమ్ ॥
వేదవృక్షం ప్రవిభజ్య స్వశిష్యేభ్యః ప్రదాయచ ।
ఇతిహాసం తదన్తస్థం సముద్ధృత్య మనీషయా ॥
పురాణ సంహితాం చక్రే పురాణార్థవిశారదః ।
తదర్థానాం నిర్ణయాయ బ్రహ్మసూత్ర మకల్పయత్ ॥
తద్భాష్యభూతం పురాణం భాగవతం విదుర్బుధాః ।

3 శ్రీమద్భాగవతమ్— స్క 1-అ5.

"ఏవం సంభాష్య భగవాన్ నారదో వాసవీసుతం ।
ఆమన్త్ర్య వీణాం రణయన్ యయౌ యాదృచ్ఛికో మునిః॥
నిర్గతే నారదేసూత భగవాన్ బాదరాయణః ।
శ్రుతవాం స్త మభిప్రేతం తతః కి మకరో ద్విభుః ॥
తస్మిన్ ముఖ్యాశ్రమే వ్యాసో బదరీషండ మండితే
ఆసీనోఽప ఉపస్పృశ్య ప్రణిదధ్యౌ మనస్స్వయమ్ "

4 పాణిని సూత్రమ్—.

"పారాశర్య శిలాలిభ్యాం భిక్షునట సూత్రయోః"
'పారాశర్యేణ ప్రోక్తం భిక్షుసూత్ర మధీయతే
పారాశరిణోభిక్షవః ' (కౌముదీ)

భిక్షుసూత్రం— భిక్షుత్వ సంపాదకం సూత్రం, యథానటసూత్రం,నటసూత్ర జ్ఞానేహినటత్వ సంపత్తిః, ఏవంతద్ జ్ఞానేన బ్రహ్మరూపత్వేన సర్వజ్ఞానాత్ కర్మ స్వనాదరేణభిక్షుత్వసంపత్తేః "వేదాన్తాన్ విధివచ్ఛ్రుత్వా సంన్యసే దనృణో ద్విజః "ఇతిమనూక్తేః ॥ భిక్షవఇతి। భిక్షుత్వయోగ్యాఇత్యర్థః। పారాశర్యోవ్యాసః" (శబ్దేందుశేఖరః)

5 శాండిల్యసూత్రం— ఆహ్ని. 2. సూ. 4.

"ఆత్మైకపదాం బాదరాయణః" భాష్యం— బాదరాయణ ఆచార్యో భగవా న్మనుతే వ్యాసః—'ఆత్మేతి తూపగచ్ఛన్తి గ్రాహయన్తిచ" ఇత్యాదిసూత్రై రిత్యర్థః'।

6 విద్యారణ్యభాష్యం—ఋక్సంహితా।

"జైమినిశ్చోదనాసూత్రే విధివాక్యం ధర్మే ప్రమాణమితి ప్రతిజ్ఞాయ, ఔత్పత్తికసూత్రే తత్ప్రామాణ్యం సమర్థయామాస. వ్యాసోపి 'శాస్త్రయోనిత్వాత్' ఇతి సూత్రే వేదాన్తానాం బ్రహ్మణి ప్రామాణ్యం ప్రతిజ్ఞాయ 'తత్తుసమన్వయాత్' ఇతిసూత్రైః సమర్థయామాస"

7 శ్రీ భాష్యం—

'పారాశర్యవచస్సుధా ముపనిషద్దుగ్ధాబ్ధిమధ్యోద్ధృతామ్'

శ్రుతప్రకాశికా వ్యాఖ్యా—

పారాశర్యశబ్దేన జన్మోత్కర్షః. 'సహోవాచ వ్యాసః పారాశర్య' ఇతి శ్రుతిప్రసిద్ధేః. తస్యైవ బాదరాయణసంజ్ఞత్వమ్। తథోక్తం మహర్షిణైవ"ద్వీపె బదరికామిశ్రే బాదరాయణ మచ్యుతమ్। పారాశరా త్సత్యవతీపుత్రంలేభే పరన్తపమ్"ఇతి। యద్యపి ఋష్యన్తరే బాదరాయణశబ్దప్రయోగః తథాపి సూత్రకృద్విషయోబాదరాయణశబ్దపారాశర్యగోచర ఏవ; తథాచ స్కాన్దే వ్యక్తముక్తమ్-

'నారాయణా ద్వినిష్పన్నం జ్ఞానం కృతయుగే స్థితం।
కించిత్తదన్యథాభూతం త్రేతాయాం ద్వాపరేఽఖిలమ్॥
గౌతమస్య ఋషే శ్శాపాత్ జ్ఞానే త్వజ్ఞానతాం గతే।
సంకీర్ణబుద్ధయో దేవా బ్రహ్మరుద్రపురస్సరాః॥
శరణ్యం శరణం జగ్ముః నారాయణ మనామయమ్।

తై ర్విజ్ఞాపితకార్యం తు భగవా న్పురుషోత్తమః ॥
అవతీర్ణో మహాయోగీ సత్యవత్యాం పరాశరాత్ ॥
ఉత్పన్నాన్ భగవాన్ వేదా నుజ్జహార హరిస్స్వయమ్
... ... ... ... తస్యార్థవిత్తయే
చకార బ్రహ్మసూత్రాణి యేషాం సూత్రత్వ మంజసా॥

8 మధ్వాచార్యభాష్యమ్—

"ద్వాపరే సర్వత్ర జ్ఞాన ఆకులీభూతే తన్నిర్ణయాయ బ్రహ్మాద్యైరభి ర్థితో భగవా న్నారాయణో వ్యాసత్వేనాఽవతతార. అథేష్టానిష్టప్రాప్తి పరిహారేచ్ఛూనాం తద్యోగ మవిజానతాం తత జ్ఞాపనార్థం వేద ముత్పన్నం వ్యంజయన్ చతుర్ధా వ్యభజత్ । తన్నిర్ణయాయ బ్రహ్మసూత్రాణి చకార"

9. శ్రీకంఠాచార్యకృతబ్రహ్మసూత్రభాష్యమ్—

"శ్రీమతాం వ్యాససూత్రాణాం శ్రీకంఠీయః ప్రకాశ్యతే ।
మధురో భాష్యసందర్భో మహార్థో నాతివిస్తరః ॥

10, వేదాన్తవాచస్పత్యమ్—

"బ్రహ్మసూత్రకృతే తస్మై వేదవ్యాసాయ వేధసే ।
జ్ఞానశక్త్యవతారాయ నమో భగవతో హరేః ॥"

11. సర్వజ్ఞమునికృత సంక్షేపశారీరకమ్—

"వాగ్విస్తరా యస్య బృహత్తరఙ్గా వేలాతటం వస్తుని తత్త్వబోధః
రత్నాని తర్కప్రసరప్రకారాః పునాత్వసౌ వ్యాసపయోనిధిర్నః॥

మధుసూదనసరస్వతీవ్యాఖ్యా—

"రత్నాకరరూపేణ భగవన్తం వ్యాసం విష్ణ్వవతారం సూత్రకారం ప్రథమగురుం స్తౌతి"

12 వేదాన్తాద్వైతసిద్ధాంతదీపికా—

"అథ వైయాసికేషు వివర్తవాదిన స్తు వ్యాససూత్రాభిప్రాయ మిత్థం ప్రతిపాదయన్తి"

13 శాంకరభాష్యవ్యాఖ్యా-రత్నప్రభా—

"శ్రీశంకరం భాష్యకృతం ప్రణమ్య వ్యాసం హరిం సూత్ర

కృతం చ వచ్మి । శ్రీభాష్యతీర్థే పరహంసతుష్ట్యై వాగ్జాల బన్ధచ్ఛిద మభ్యుపాయమ్ ॥

...తం జిజ్ఞాసు ముపలభమానో భగవాన్ బాదరాయణః తదను బన్ధచతుష్టయం శ్రవణాత్మకశాస్త్రారంభప్రయోజకం న్యాయన నిర్ణేతు మిదం సూత్రం రచయాంచకార—"అథాతో బ్రహ్మజిజ్ఞాసేతి"

పూర్ణానందీయవ్యాఖ్యా—

'బదర్యః బదరీవృక్షాః యస్మిన్ దేశే సన్తి స దేశవిశేషో బాదరః సఏవాఽయనం స్థానం యస్య స బాదరాయణః శ్రీవేదవ్యాసః, అత్ర సంజ్ఞాత్వాణ్ణత్వప్రాప్త్యా కీటాదివ్యావృత్తి, ర్బోధ్యా"

14 శ్రీఅప్పయదీక్షితకృతభారతతాత్పర్యసంగ్రహః—

"శ్రీబాదరాయణముని స్స్వయమేవ విష్ణుః,
పార్థచ్ఛలా త్త్వమధికృత్య కృతే ప్రబన్ధే।
తస్యాపి నిత్యమహితం శశిభూషణ త్వా,
మామ్రేడయన్ గురు రదర్శయ దాదితత్త్వమ్"॥

మూలకారవ్యాఖ్యా—

శ్రీబాదరాయణనామా ప్రసిద్ధోమునిః స్వయమేవ విష్ణుః—"కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం స్వయం । కోహ్యన్యః పుండరీకాక్షా న్మహాభారతకృ ద్భవేత్."

15 షడ్దర్శనకారసంగ్రహశ్లోకః—

"కపిలస్య కణాదస్య గౌతమస్య పతంజలేః,
వ్యాసస్య జైమినే శ్చాపి శాస్త్రాణ్యాహుః షడేవ హి॥"

ఇత్యాది బహుప్రమాణములు వేదవ్యాసుడు బాదరాయణుడే అనియు, బ్రహ్మసూత్రకర్త వేదవ్యాసుడే అనియు నుద్ఘోషించు చున్నవి. విద్యాసంప్రదాయము భ్రష్టమయి అవైదికసంస్కారము ప్రబలినకారణముచే కువ్యాఖ్యానములు బయలుదేరి శ్రేయస్కాముల మనస్సులకు కలత కలిగించుచున్నవి.

పై ప్రమాణముల నవలోకించువారికి సంప్రదాయాగతమైన విద్వత్సిద్ధాంత మెంత బలిష్ఠమైనదో స్పష్టమగును.

# శ్రీఅన్నవరందేవస్థాన-సభా సమావేశము

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు బ్రహ్మసూత్రకర్త వేదవ్యాసుడు కాడనుచు పత్రికలలో నిరూపించుటయు, వారి వాదము అసంగత మని నేను నిరాకరించుటయు జరిగినతరువాత వేం వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు నాకిట్లు కబురు పంపినారు.—

"అన్నవరదేవస్థానములో జరుగబోవు కల్యాణాంగమైన విద్వత్సభలో మన వాదప్రతివాదముల బరిష్కరించుకొనుట, మీకుసమ్మతమైనచో నాప్రమాణములతో నేను ఆ సభకు వచ్చుచున్నాను" అని.

దానికి అట్లే యని చెప్పి యాసభకు వెళ్ళియున్నాము.

—• శ్రీ అన్నవరదేవస్థాన సభా సమాచారము •—

ఆ సభలో వాది యొకమధ్యస్థుని, ప్రతివాది యొక మధ్యస్థుని కోరికొనుట, ఆ మధ్యస్థు లిద్దరును మరొకమధ్యస్థుని కోరికొనుట, ఆ ముగ్గురును పరిష్కరించుట అను నిబంధనముపై వాది వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారిని, ప్రతివాదిగా నున్న నేను శ్రీపిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారిని ఎన్నుకొనగా వారిద్దరును శ్రీరాళ్ళభండి వేంకటసీతారామశాస్త్రిగారిని ఎన్నుకొనినారు. ఈ ముగ్గురును వాదోపవాదములను విని పరిశీలించి లిఖితరూపమైన తమతీర్పుల నిచ్చియున్నారు. వాని సారాంశము విషయపరిజ్ఞానమునకై ప్రదర్శింపబడుచున్నది.

—• వాదికోరిన మధ్యస్థుని తీర్పు—సమగ్రము •—

"విషయము:- వ్యాసుడు బాదరాయణుడు

వాది:- పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి.

ప్రతివాది:- వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి.

స్థానము:- అన్నవరము-సత్యనారాయణస్వామివారి సమక్షము

తీర్పరి:- జమ్మలమడక మాధవరామశర్మ—

పండితుడు- ఎ. సి కాలేజీ, గుంటూరు.

పరిష్కారము—

అన్నవరము శ్రీసత్యనారాయణస్వామి సమక్షములో వ్యాసుడు బాదరాయణుడు, అనే విషయమును అనుసరించి శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి అను వారు కావించిన వాదోపవాదములను సావకాశముగా అవగాహనము చేసి

కొన్నాను. వారి ఆయా వాదోపవాదములు అంతకు పూర్వమె పత్రికలందు ప్రకటితము లయినందువలన తగిన సమయములోనే పరిశీలించే అవకాశము కలిగింది.

అన్నవరములో జరిగిన వాదోపవాదములలో ప్రకటితవ్యాస పఠనమె జరిగింది. వారణాసివారు అప్రకటితము లయిన కొన్ని వచనాలను చదివి విన్పించారు. మొత్తము వీనిని అన్నిటినీ శ్రద్ధగా భావించాను.

వ్యాసుడు, బాదరాయణుడు భిన్నవ్యక్తులని పెండ్యాలవాదము. ఇద్దరూ అభిన్నులని వారణాసి వాదము.

ఈ వాదప్రతివాదములు చేసినవారిద్దరూ...భగవత్పాద శంకర స్వామిసంప్రదాయమునకు సంబంధించిన వ్యక్తులు. అయినప్పటికి అన్య సంప్రదాయమువారి వచనాలను తమ రచనలకు బలముగా స్వీకరించారు. ఈ విషయంలో కేవలము ఒక శంకరసంప్రదాయమువారు కాక ఇతరసంప్రదాయమువారున్నూ నిరూపించిన భావాలను సమీక్షింప వలసిన అవసర మున్నట్లు సిద్ధమవుతున్నది.

వ్యాసబాదరాయణవిషయములో చాలా సంప్రదాయములు ఉన్నవి. ఆయా గ్రంథములున్నూ దుర్లభములు కావు సంప్రదాయములు ఏకాదశాధికములుగా ఉన్నట్లు స్పష్టము.

ప్రకృతము ఒక సంప్రదాయముమాత్రము వారువిషయమును చర్చించారు. ఇతరసంప్రదాయములవారు ఆ సభకు రాలేదు. వచ్చినా చర్చలో పాల్గొనలేదు.

2 ఈ విషయమును కేవలము పెండ్యాల వారణాసి యీ యిద్దరి వచనాలవలన నిర్ణయించడానికి అవకాశము తక్కువ.

తమ వాదమె నిర్ణయానుకూలము అనే ఉద్దేశములో ఇద్దరు తమ తమ భావాలను వ్యక్తము చేశారు. అయితే ఇద్దరూ ఈ విషయములో వాదము చేసిన్నీ ఏకముఖమయినవాదమును నిరూపించనందు వలన కూడా నిర్ణయానికి వీలు కనబడలేదు.

3 పెండ్యాలవారు చారిత్రకమైన దృష్టితో సమీక్షించారు. ఏ వచనమయినా ప్రమాణ మగునా ; కాదా ? అనే సందేహములో

చరిత్రాధారముగా నిర్ణయించడమును పెండ్యాల ఇష్టపడుతారు. వ్యాసబాదరాయణ నామానువాదం చేసిన కవులకు, పండితులకూ చారిత్రికదృష్టి లేదని, అటువంటివారు చారిత్రికతను నిరూపించితే దానిని ప్రమాణముగా గ్రహింపనక్కరలేదని పెండ్యాల భావముగా కనపడుతుంది.

ప్రాచీనగ్రంథాల ప్రామాణికతను ఈ విధముగా చూచే వీరికి ఆయా గ్రంథవచనాలు ప్రామాణికంగా కనపడవు.

4 చరిత్రసంబంధము లేని ప్రామాణికదృష్టితో వారణాసివారి వాదము సాగింది. సంస్కృతపండితులు తమగ్రంథాలలో వ్యాసబాదరాయణాభేదమును భావించిన విధానమును వారణాసివారు నిరూపించారు.

అనుగతంగా వస్తూ ఉన్న ఒక అభిప్రాయమును యథాతథంగా ఆ పండితులు గ్రహించా రనడము స్పష్టమవుతూ ఉన్నట్లు గుర్తించవలసి ఉంది. వారందరూ వ్యాసబాదరాయణులు భిన్నులా ? అన్న శంకను మనసులో పెట్టుకొని తత్సమాధానంగా అభేదమును నిర్దేశించా రనడానికి ఆధారములు బాగా కన్పించడము లేదు.

5 పెండ్యాల గ్రంథాల ప్రామాణికతలో ఒక సూచన ప్రదర్శించారు. క్రీస్తు శకం 7వ శతాబ్దం తరువాత వచ్చిన గ్రంథాలలో వ్యాసబాదరాయణాభేదనిర్ణయం ఉన్నప్పటికీ అది ప్రకృతంలో ప్రమాణంగా స్వీకరించడానికి వీలు కాదంటారు. అంతకు పూర్వపుగ్రంథాలలో ఆ విషయముంటే అది ప్రక్షిప్తం కాదని ముందుగా నిర్ధారించుకోవలసిన అవసరమునున్నా పెండ్యాల భావించడముచేత విషయచర్చ మరీ దూరముదాకా పోయింది. ఏవి ప్రక్షిప్తములో ఏవి కావో నిర్ణయించడానికి ఆ సమయంలో ఉభయులూ ఏ సూచననూ ఇవ్వలేదు. కనుక ఆ ప్రఘట్టంలో విషయము అనిర్ధారితమె అన్న భావము వారిద్దరిహృదయాలలో ఉన్నట్లు ఊహించడానికి శ్రమపడవలసిన అవసరము కనపడడము లేదు. కాగా ఇద్దరూ ఏకపథములో విషయమును సుదృఢంగా నిర్ధారించడానికి ప్రయత్నపడినట్లు తోచదు.

6 వ్యాసుడు నిరూపించిన విషయము, బాదరాయణుడు నిరూపించినవిషయము ఒకటేనా ? వేరు వేరా ? అనే విషయాధారముగా ఎవరి విమర్శకూడా గాఢముగా లేదు.

7 ఒకరివాదమును విన్న మరొకరు తమవాదమును ఉపసంహరించుకొనడానికి అంగీకరించలేదు. కాగా అసలు విషయముపైనకంటె ఒకపట్టుదల ముఖ్యంగా పెట్టుకున్నారా ? అనిపించక తప్పలేదు. వాది బలముకన్న వాదబలమునె నిర్ణాయకుడు స్వీకరించాలి.

8 మొదటగా పెండ్యాలవారివాదము సాగింది. తరువాతక్రమానుసారంగా వారణాసివారి ప్రతివాదము సాగింది.

దానిని వినినతరువాత పెండ్యాలవారు తమవాదమును ఉపసంహరించుకోదలచుకొన్నట్లయితే దానికి తగిన అవకాశమును జడ్జి ముఖంగా అదించబడినా పెండ్యాలవారు ఉపసంహరించుకోదలచనందున సభను పొడిగింపవలసివచ్చింది. సాయంకాలము 3 గంటలకు సభ వాయిదా వేశారు. అప్పుడు పెండ్యాలవారి పునర్వాదము శ్రుతపరచబడింది కదా! దానిని విని వారణాసివారు తమవాదమును ఉపసంహరించుకోదలచినట్లయితే అందుకు తగిన అవకాశమును వారికి జడ్జి ముఖంగా అందించవలసిన అవసరం ఉంది.

కాని ఏకారణంవలననో వారణాసివారు సాయంసభకు రాలేదు. వారు ఉపసంహరించుకునే వారో లేదో తెలుసుకొనడానికి జడ్జిలకు వేరు అవకాశము లేదు

9 కాగా ఈ యిద్దరికి సంబంధించిన ఊహను నిశ్చయరూపముగా గుర్తించడానికి వీలులేదు అందువలన నేను ఈ "బాదరాయణవ్యాస" తగాయిదాను త్రోసివేస్తునాను. ఏవిధమయిన నిర్ణయమును ఇవ్వడము లేదు ఇందు నిరూపించినదంతా సావధానముగాసమీక్షింపబడినదే"

ఇట్లు,
జమ్మలమడక మాధవరామశర్మ.
(జడ్జి:-అన్నవరం సభ.)
పండితుడు:- ఎ. సి. కాలేజి.
గుంటూరు.

రిపుటలు

—• ప్రతివాది కోరిన మధ్యస్థుని తీర్పు-సంగ్రహము •—

బ్రహ్మసూత్రకర్తయగు బాదరాయణుడు వ్యాసు డగునా ? కాదా ? అను వివాదమునుగూర్చిన తీర్పు—

ది 4-5-1947 సం॥ సర్వజిత్సంవత్స వైశాఖ శుక్ల ౧౪ ఆదివారమున అన్నవరము శ్రీ సత్యనారాయణస్వామివారి సన్నిధిని బ్రహ్మసూత్రకర్త యగు బాదరాయణుడు వ్యాసు డగునా? కాదా? అను విషమునుగూర్చి వాదము జరిగెను.

1 బ్రహ్మసూత్రకర్తయగు బాదరాయణుడువ్యాసుడు కాడు. అనువారు పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వాది.

2 బ్రహ్మసూత్రకర్త యగు బాదరాయణుడు వ్యాసుడే అనువారు వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రతివాది.

ఈ వాదిప్రతివాదు లిదివరలో తమతమ వ్యాసములను పత్రికలందు ప్రచురించియున్నారు. పండితుల సమ్ముఖమున విమర్శించి సిద్ధాంతమును నిర్ణయించుటకు ఈ సభయందు తిరిగి చర్చ ఆరంభింపబడినది.

ఆ సభలో మధ్యస్థులలో నొకడనగు నేను వాదిప్రతివాదుల వాదవిషయముల బరిశీలింపగా తోచిన నిర్ణయము వ్రాయుచున్నాను—

నిర్ణయసారాంశము-వాదిప్రతివాదుల వాదములను సమగ్రముగ పరిశీలింపగా శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వాదప్రకారము బ్రహ్మసూత్రకర్తయగు బాదరాయణుడు వ్యాసుడే. వ్యాసునికంటె నితరుడు గాడు. ఇది సకలవిమర్శక సిద్ధాంతము. దీనిని క్రమముగా ప్రమాణములతో వ్రాయుచున్నాను......

పురాణములందు బాదరాయణు డగు వ్యాసుడు బ్రహ్మసూత్రముల రచించె నని యున్నది. ఆ పురాణములు నవీనములనుట సాహసము, చారిత్రకవిరుద్ధము, భారతీయవిజ్ఞానయును న్యూనతపరచుట, సత్యదూరము నగుచున్నది. అట్టివాక్యములను సత్యమునుగోరు భారతీయుడు విశ్వసింపడు......

విద్యారణ్య- రామానుజ-మధుసూదన-పూర్ణానంద- శ్రీకంఠాచార్య-అప్పయదీక్షిత-మధ్వాచార్య-వీరరాఘవ-విజయధ్వజా- ద్యనేక

గ్రంథకర్తలు ఈ విషయమును సవిమర్శముగ నిర్ణయించి బాదరాయణు డగు వ్యాసభట్టారకుడు బ్రహ్మసూత్రముల రచించెనని స్పష్టముగ వ్రాసియుండిరి. అట్టి అనేకవాక్యములను వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రమాణముగా నిచ్చియున్నారు......

అయినను సాహసించుచున్నాను.' అని చెప్పుచు వాది యీ వాదమునకు దిగెను. తనవాదమునకు గొన్ని కారణములను వాది వ్రాసెను ఆ కారణములు నిష్ప్రయోజనములు. వాది చూపిన కారణములు ప్రతివాదిసమాధానములు గమనింపదగినవి......

'వ్యాసుడు బ్రహ్మసూత్రముల రచించియుండడు. వ్యాసుని కంటెనితరుడగు బాదరాయణుడే రచించెను. ఉమాకాంతపండితుడిట్లు వ్రాసెను" అని వాదిచెప్పుకారణములలో నొకటి......

...భాష్యాదులప్రమాణమట; ఎవరో ఉమాకాంతపండితుడట; వారిమాట ప్రమాణమట; ప్రకృతకాలమున ఇట్టి కువాదముల సేయువారును, ఆ వాదములనే యథార్థమని తలచువారును అధికు లగుచున్నారు. ఇది కలిమహిమ......

బ్రహ్మసూత్రకర్త వ్యాసుడా? బాదరాయణుడా? అని వాది వాదము చేయసాగెను. తుదకు ప్రతివాదిప్రత్యుత్తరములచే వ్యాసుడును బాదరాయణుడని వ్యవహరింపబడుటచేత బ్రహ్మసూత్రకర్త బదరదేశవాసి బాదరాయణుడా? బదరవంశీయబాదరాయణుడా? అను వాదమునకు చేరినది. బాదరాయణుడు వ్యాసునికంటె భిన్నుడు కలడనియే వాది చూపగలిగెను. వ్యాసునకు బాదరాయణనామము చెల్లదనుటకు వాదిమాపిన కారణము నిలువదు......వాది వ్రాతలలో తగిన యుక్తి గానవచ్చుట లేదు......ప్రతివాది యగు శ్రీ శాస్త్రిగారు వైయాకరణు లగుటచే వారు చెప్పిన యర్థమును గాదనుటకు వట్టిమాటలు ఉపకరింపవు......

సిద్ధాంతము—పైన వ్రాయబడిన అనేక కారణములచే వ్యాసుడే బ్రహ్మసూత్రకర్త. బాదరాయణులు ఇద్దరు కలరు. వ్యాసు డొక బాదరాయణుడు. ఈ విషయము సకలపురాణసమ్మతము. సకలగ్రంథకృత్సమ్మతము ప్రాచీనపరంపరాసిద్ధము.

వాది యగు పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి యొక్కయు, తదితరులగునవీనులయొక్కయు 'వ్యాసభిన్నుడగు బాదరాయణుడు బ్రహ్మసూత్రకర్త', అనువాదము నిరాధారము, నిర్యుక్తికము, ప్రమాణవిరుద్ధము. అనేకశాస్త్రములందు పాండిత్యము గలిగి అనేక గ్రంథములను నూతన దృష్టితోగూడ విమర్శించి న్యాయమును లోకమునకు వెల్లడించుచున్న ప్రతివాది శ్రీ వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రిగారెంతయు ప్రశంసార్హులు.

ది2-7-47<br>పొడగట్లపల్లి. } 28 పుటలు. పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రి<br>విద్వద్వినీతః

— మూడవప్రధానమధ్యస్థుని తీర్పు—సంగ్రహము.

బ్రహ్మసూత్రకర్త యగు బాదరాయణుడు వ్యాసుడగునా? కాదా? ఈ విషయమును విచారించి సిద్ధాంతీకరించుటకు అన్నవరము దేవస్థానములో ది 4-5-1947 నాడు దేవస్థానధర్మకర్తలగు శ్రీ రాజా ఇనుగంటి సూర్యప్రకాశరాయణింగారి అనుమతిమీద పండితసభ కావింపబడెను. ఆ సభలో శ్రీ పెండ్యాలవారు, శ్రీ జమ్మలమడక మాధవ రామశర్మగారిని, శ్రీ వారణాసివారు శ్రీ పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రి గారిని మధ్యస్థులనుగా కోరుకొనగా వారు ఉభయులు నన్ను ప్రధాన మధ్యస్థునిగా కోరుకొనిరి

ఉభయవాదుల వాదములను, ప్రమాణములను విని సంపూర్తిగా విమర్శించి ప్రధానమధ్యస్థుడనైన నేను ఇవ్విధంబున తీర్మానింపనయినది—

"ఇప్పటికి 7 శతాబ్దములనుండి వ్యాసబాదరాయణులను ఏక వ్యక్తిగా దలచిన సంస్కృతాంధ్రగ్రంథకర్తలకు వ్యతిరేకముగ వేదవ్యాసుడు బాదరాయణుడు కాడని నేనీ క్రింది 14 కారణములచే వ్రాయ సాహసించుచున్నాను."

అని పెండ్యాలవారు పత్రికలో వ్రాసియున్నారు. వారు చెప్పినట్లయినను 7 శతాబ్దములనుండియు వ్యాసబాదరాయణులు ఒకరే యని నిర్వివాదప్రతీతి స్పష్టమగుటచేతను అట్టిప్రతీతికి వ్యతిరేకముగా

తాము 'వ్రాయసాహసించుచున్నామని' సాహసశబ్దముకూడ ప్రయోగించుటచేతను వేదవ్యాసుడు బాదరాయణుడు కాడని రుజువుచేయవలసిన భారము పెండ్యాలవారిమీద నున్నది.

పెండ్యాలవారు తమవాదమును రుజువుచేసికొనుటకు 14 కారణములను ఇచ్చియున్నారు......

పెండ్యాలవారివాదము సరియైనది కాదు...శ్రుతప్రకాశికలో "ద్వీపే బదరికామిశ్రే బాదరాయణ మచ్యుతమ్। పరాశరా త్సత్యవతీ పుత్రం లేభే పరన్తపమ్" అనియున్న యీ యొక్క ప్రమాణవచనమే పెండ్యాలవారి వాదమును ఖండించి వారణాసివారివాదమును ధ్రువపరచుచున్నది.

పెండ్యాలవారు ప్రమాణముగా నిచ్చినవారిలో—

1 బాలగంగాధరతిలకుగారు—"మూలభారతమునకును, తదన్తర్గతగీతలకును ప్రకృతమందున్న స్వరూపమును వ్రాయుటయు బ్రహ్మసూత్రములను రచించుటయు అనురెండు కార్యములను ఒకబాదరాయణులగు వ్యాసులే చేసియుందురని ఊహింపవచ్చును." అని వ్రాసినారు ఇది పెండ్యాలవారికి విరుద్ధము.

2 పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు—'ఏది ఎట్లున్నను సంప్రదాయజ్ఞులగు భాష్యవ్యాఖ్యాతలు సూత్రకర్త వ్యాసులే అని చెప్పుటచేతను, పౌరాణికులు వ్యాసబాదరాయణు లొక్కరే యని వ్యవహరించినట్లు కాన్పించుటచేతను వారిద్దరు నొకరే యని నిర్ణయము చేయవలసియున్నది." అని వ్రాసినారు. ఇదియు పెండ్యాలవారికి విరుద్ధమే.

3 పండిత సీతానాథతత్త్వభూషణులు— వీరు బ్రహ్మసూత్రములను ఆంగ్లభాషలో వ్యాఖ్యానము చేయుచు, పీఠికలో నిట్లువ్రాసిరి—"వేదవిభాగముచేసిన బాదరాయణుడు అనే కృష్ణద్వైపాయనుడు సూత్రకర్త" అని వ్రాసిరి.

ఇదియు పెండ్యాలవారికి విరుద్ధమే......

ఇంకను ఆధునికుల అభిప్రాయములను ప్రమాణముగా తీసికొనుపక్షమున వారణాసివారివాదమే నిజమైన దని తేలుచున్నది అందుకు గొన్నిటి నుదాహరించుచున్నాను—

1 సర్. ఎస్. రాధాకృష్ణన్ పండితులు—"హిందూసంప్రదాయ ప్రకారము వ్యాసుడే బాదరాయణుడు. గోవిందానంద వాచస్పతి, ఆనందగిరి, మున్నగు శంకరశిష్యుల అభిప్రాయప్రకారముగూడ ఉభయులును ఒక్కరే. రామానుజ, మధ్వ, వల్లభ, బలదేవులును బ్రహ్మసూత్రకర్త వ్యాసుడే అని వ్రాసియున్నారు" (ఇండియన్‌ఫిలాసఫీ) అని అభిప్రాయ మిచ్చిరి.

2 స్వామి వీరేశ్వరానందులు—వీరు ఆంగ్లభాషలో రచించిన బ్రహ్మసూత్రవ్యాఖ్యానముయొక్క ఉపోద్ఘాతములో నిట్లు వ్రాసిరి—

"సూత్రకర్తయగు బాదరాయణుని గురించి సంప్రదాయము భారతకర్తయగు వ్యాసుడే అని ఐక్యము చేయుచున్నది శంకరశిష్యులును రామానుజాదులును వ్యాసుడే సూత్రకర్తయని నిర్వచించియున్నారు" అని.

3 మహామహోపాధ్యాయ శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రిగారు—వీరురచించిన ధర్మప్రబోధములో నిట్లు వ్రాసియున్నారు—1 మనకు సన్నిహితమగు ద్వాపరాంతమున కృష్ణద్వైపాయనుడు(బాదరాయణుడు) అను ఋషి బ్రహ్మాజ్ఞచే వేదవిభాగమును చేసి వ్యాసులను బిరుదము నొందెను" అని.

4 శ్రీ శ్రీ శ్రీ జగద్గురు కల్యాణానందభారతీస్వాములవారు-కల్యాణసుధలో నిట్లు వ్రాసియున్నారు— శ్రీకృష్ణద్వైపాయనమహర్షి వేదాంతమీమాంసాశాస్త్రమును రచియించెను" అని.

5 మోక్షముల్లరుదొరగారు—ఆంగ్లభాషలో రచించిన షడ్దర్శనములు అను గ్రంథములో నిట్లు వ్రాసిరి— "హిందూదేశములో మహాభారతకర్త యగు వ్యాసుడే బాదరాయణుడు. అని సిద్ధాంతము."

6 బ్రౌనుదొరగారు— 'బాదరాయణుడు అనగా వ్యాసుడే' అని వ్రాసి యున్నారు.

ఇట్లు చరిత్రాత్మకదృష్టియం దారితేరిన విమర్శకాగ్రేసరు లగు ఆధునికులుగూడ, వారణాసివారి వాదమునే బలపరచుచున్నారు...

పెండ్యాలవారి 14 కారణముల వలన వారివాదము రుజువు కాలేదనుట స్పష్టము. కావున వారిమీద నున్న రుజువుభారము వారిచే నిర్వహింపబడలేదు. వారణాసివారు పెండ్యాలవారివాదము సయుక్తికముగ ఖండించుటయే కాక తమవాదమును స్పష్టీకరించు అనేక ప్రమాణములను ఉదాహరించియున్నారు......

గ్రంథప్రమాణములకు ప్రత్యుత్తర మేమి చెప్పుదు రని శ్రీ పెండ్యాలవారిని నేను ఆ సభలోనే ప్రశ్నింపగా వారందరికి చారిత్రాత్మకదృష్టికాని, విమర్శజ్ఞానము కాని లేదనియు వ్యాసబాదరాయణులు ఒకరేయని వారనుకొని అట్లు రచించిరనియు, పెండ్యాలవారు ప్రత్యుత్తరమిచ్చిరి...... పెండ్యాలవారి వాదమున కనుకూలురగు చారిత్రాత్మకదృష్టికల విమర్శకులు ఎవరో కానరాకున్నది... అన్ని ప్రమాణములును ఎట్టి శంకను తావులేకుండ స్పష్టముగా 'బ్రహ్మసూత్రకర్త యగు బాదరాయణుడు వ్యాసుడే' అనినిరూపించుచున్నవి.

కావున శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వాదమే సప్రమాణమై యుక్తియుక్తమై సంప్రదాయానుసారియై ఆధునికచారిత్రాత్మకవిమర్శ గాసమ్మతమై విరాజిల్లు విద్వత్సిద్ధాంతమనియు, వా బాదరాయణులు భిన్ను లని వాదించు శ్రీ పెండ్యాలవారి వాద నిష్ప్రమాణము,నిస్సారము, నిరుపపత్తికము ప్రమాణవిరుద్ధము కా: పరిహరింపదగినదనియు ప్రథానమధ్యస్థుడనైన నానిశ్చితాభిప్రాయ.

నాతోపాటు మధ్యస్థులుగా నున్న యిద్దరిలో శ్రీ వారణాసి వారిచే నెన్నుకొనబడిన శ్రీ పిసుపర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు పరిశీలించియే నాతో ఏకీభవించి తమ తీర్పును వ్రాసియున్నారు.

పెండ్యాలవారు ఎన్నుకొనిన శ్రీమాధవరామశర్మగారు "ఈ విషయము సంపూర్ణముగా విమర్శింపబడలేదను కారణముమీద తమ అభిప్రాయమును ఇదమిత్థమని వ్యక్తము చేయుటకు ఏవిధమైన నిర్ణయమును ఇవ్వడము లేదు" అని వ్రాసినారు.

పెండ్యాలవారు తమ వాదమునకు అనుకూలకముగ 14 హేతువులు ప్రదర్శించినందునను, వారణాసివారు ఆ 14 హేతువులను ఖండించి 20 ప్రమాణములను తమ వాదమునకు అనుకూలముగ చూపియున్నందునను ఆనందగిరి-రామానుజ-మధ్వ-శ్రీకంఠ- ఆచార్యప్రభృతుల గ్రంథప్రమాణములను, తిలక్ మున్నగు అధునికవిమర్శకాగ్రేసరుల అభిప్రాయములుకూడ ప్రదర్శింపబడియున్నను, విషయము సంపూర్ణముగా విమర్శింపబడలేదను కారణముచేత శ్రీమాధవరామశర్మగారు తమ అభిప్రాయము నివ్వక వదలివేయుట చింత్యము.

శ్రీ శర్మగారి గురువర్యులును పూజ్యపాదులు నగు శ్రీ శ్రీ శ్రీ కల్యాణానందభారతీస్వాములవారియొక్కయు, శ్రీ బాలా సుబ్రహ్మణ్యశాస్త్రులవారియొక్కయు, అభిప్రాయములు శ్రీ వారణాసి వారివాదమునే ధ్రువపరచుచున్నను వారల ముఖ్యశిష్యరత్నమగు శ్రీ మాధవరామశర్మగారు ఇట్టి తాటస్థ్యమును వహించుట వారిపై లక్ష్యమునకు సూచకముగా గ్రహింపవలెను.

ఏది యెట్లున్నను ముగ్గురు మధ్యస్థులలో నిద్దరు శ్రీ వారణాసి వారి వాదమే సరియైన సిద్ధాంతమని తీర్పు చేసినందునను, మూడవ

మధ్యస్థులు ఎట్టిఅభిప్రాయము నివ్వనందునను శ్రీ వారణాసి [illegible]వాదానుసారముగా 'బ్రహ్మసూత్రకర్తయగు బాదరాయణుడు వ్యాసుడే" అని మధ్యస్థుల తీర్పు ప్రకటింపబడినది.

ది 4-5-47 అన్నవరములో జరిగిన సభలో ఉభయపక్షా వాదములు వినినతరువాత ఆ సాయంకాలమే శ్రీ అన్నవరదే[illegible] ధర్మకర్తలగు శ్రీరాజా యినుగంటి సూర్యప్రకాశరాయణింగారి [illegible] మీద వారి సమక్షమునను ఉభయవాదులసమక్షమునను ఇతరప[illegible] బృందసమ్ముఖమునను శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి— [illegible], వ్యాకరణము [illegible], [illegible] వాదము [illegible] కాదనియు [illegible] నేను [illegible]యము [illegible]చుంటిని.... ..